Registered No. M-4484

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ నవంబరు నెల 13 వ తేది శుక్రవారం [నె 45 రు.



స్టాలిను

## మన యుద్ధాశయాలు.

"మన మొదటి యుద్ధాశయం హిట్లరురాజ్యాన్ని అతన్ని ప్రోత్సాహించువారిని నాశనంచేయుట.

రెండోది, హిట్లరు సైన్యాన్ని దాని నాయకులను రూపుమాపుట.

మూడోది, యూరోప్పులో యీ నూతన వ్యవస్థను తొలగించి దాని స్థాపించినవారిని శిక్షించుట.

సోదరులారా, మనం మహాస్వాతంత్ర్య యుద్ధం జరుపుచున్నాము. కాని ఒంటరిగ కాదు. మిత్రదేశాలతోకలసి పోరాడుచున్నాము. మానవకోటికి నీచశత్రువులను, జర్మను ఫాసిస్టు సామ్రాజ్యకాంక్షపరులను ఓడించి విజయం పొందెదము."

—సోవియటు రష్యా రజితోత్సవంలో స్టాలిను.

# మిత్ర రాజ్యాల సఖ్యత సహకారములు.

## స్టాలిను ఉపన్యాసం ధృవపరచుట.

సమిష్టి కృషి, సమిష్టి వ్యూహం, సమాలోచన.

మిత్రమండలి దేశాలగు బ్రిటను, అమెరికాలకును రష్యాకు మనస్పర్ధలున్నాయని శత్రు రాజ్యాలు ప్రచారం చేయడానికి విసుగుటలేదు. ఈ అసత్య ప్రచారం అనేక సారులు ఖండించబడింది. రష్యా విప్లవం 25 వ వార్షికోత్సవం సందర్భము రష్యా శాసన సభలో స్టాలిను నియంత గావించిన ఉపన్యాసంవలన యీ శత్రువుల ప్రచారము నందలి అసత్యం మరింత స్పష్టంగా బయల్పడింది.

స్టాలిను ఉపన్యాసం ప్రపంచంలో రెండే పక్షాలు.

ఈ రష్యను నాయకుడు తన ఉపన్యాసంలో ప్రస్తుతం ప్రపంచంలో రెండే పక్షాలు పోరాడుచున్నవనెను. ఇటలి-జర్మనీ సఖ్యత రాజ్యము లోక పక్షము, ఇంగ్లాండు-రష్యా-అమెరికా లోక పక్షము. ఈ రెండింటికి యుద్ధం హిట్లరు వశమయిన జర్మనీ తెచ్చిపెట్టింది జాతి ద్వేషము, ఉన్నత జాతి అను అహంకారము, ఇతర దేశాలను పీడించుకో తినడం, బలవంతాన ఆక్రమించిన దేశాలలో ప్రజా ప్రభుత్వ విధానం ధ్వంసంచేసి వాటి సంపదనంతా కొల్లగొట్టుకోవడం ఇటలీ-జర్మనీల కార్యక్రమం. దానికి విరుద్ధమయిన కార్యక్రమం : జాతిప్రత్యేకతలు తొలగించి అన్నిజాతులు సమానమని నిర్ణయించుట, వారి రాజ్య స్వాతంత్ర్యం కాపాడుట, వారికిష్టం వచ్చిన ప్రభుత్వ విధానం స్థాపించుకొనినిచ్చుట, పడిపోయిన రాజ్యాలను లేవనెత్తుట, వాటికి ఆర్థిక సహాయంచేయుట, హిట్లరు పరిపాలన అంతమొందించుట—ఇవి మిత్రరాజ్యాల కార్యక్రమం.

ఇంగ్లాండు-రష్యా-అమెరికా కూటంయొక్క ఆర్థిక నైతికబలం నానాటికి హెచ్చుచున్నదనియు, కోట్లకొలది ప్రజల సానుభూతిని బడయుచున్నదనియు, హిట్లరు తత్వమును ఓడించి తప్పక విజయం పొందగలదనియు స్టాలినుగారు తెలిపిరి. చర్చిలు మాస్కో నగరానికి రావడం వలన ఇంగ్లాండు-రష్యాల సఖ్యత పెంపొందిందనిరి.

మిత్రమండలి సఖ్యత దృఢపడుట సాధించిన కార్యములు.

మిత్రమండలి దేశాలమధ్య తగవులు పెరుగుచున్నవని జర్మనీ ప్రచారక మంత్రి గోయిబెల్సు చేస్తున్న ప్రచారానికి స్టాలిను ఉపన్యాసం గొడ్డలిపెట్టు. ఇంగ్లాండు రష్యా-అమెరికాల సఖ్యత మరీమరీ దృఢపడెననుటకు యింతవరకు మిత్రమండలి సాధించిన కార్యములను యీ సందర్భమునందు పేర్కొనుట మంచిది. సఖ్యత ఒడంబడికలలోను ప్రమాణ పత్రములలో మొదటిది అట్లాంటికు ప్రణాళిక (14-8-41). ఇందు మొదటచేరిన 26 రాజ్యాలకు తరువాత మరోనాల్గు రాజ్యాలు చేరినవి. ఇందు రూజువెల్టు పేర్కొన్న నాల్గు స్వాతంత్ర్యములు యిమిడియున్నవి. అతనన్నట్లే యిది "మానవకోటి అంతటికి" వర్తించును. తరువాత 1-1-42 వ తేదిన సంయుక్త రాజ్యాల ప్రకటన వెలువడింది. ఇందులో సంతకం చేసిన ప్రభుత్వాలన్ని ఒండొరులకు తోడ్పడుటకు బాస చేసుకొన్నవి. తరువాత యింకా అనేకం ఒడంబడికలు యిటువంటివి సంతకాలయి ప్రపంచంలో వివిధ దేశాలకు సఖ్యత కుదిర్చినవి. వాటిలో ముఖ్యమయినవి 1942 ఇంగ్లాండు-రష్యాల సంధి, 1941 పోలిషు-రష్యా ఒడంబడిక, పోలండు-జక్కు ఒడంబడిక (జూను 1942) ; గ్రీసు యుగోస్లావియా ఒడంబడిక (జనవరి 1942) ; దక్షిణాఫ్రికారాజ్యాల ఒడంబడిక (ఫిబ్రవరి 1942) ఈ ఒడంబడికలన్నీ స్వాతంత్ర్య ప్రజాప్రభుత్వం అభిలషించు జాతులన్నిటిని ఏకం చేసినవి.

* * *

సంయుక్త రాజ్యాల సమిష్టి యుద్ధకృషి.

వ్రాతలలో ఒడంబడికలలో పేర్కొనబడిన యీ సఖ్యత ఆచరణయందు ఎట్లు అనుసరింపబడిందో చూతాం. క్రమేణ పెద్ద సమిష్టి యుద్ధ వ్యవహారకూటం పెరిగింది. బ్రిటిషు-అమెరికను యుద్ధవ్యూహాలు ఆలోచించి

[తరువాయి 4 వ పేజీలో]

## ఫ్లోటింగు డాక్ — బెలూను బారేజి.



నౌకలను మరమ్మత్తు చేయుటకు నీటిలో నుండగానే దాని అడుగునకు మునిగి పైకెత్తు యంత్ర సాధనమును ఫ్లోటింగు డాక్ అంటారు. 35,000 టన్నుల యుద్ధ నౌకనుగూడ ఎత్తగల ఒక ఫ్లోటింగు డాకు పై పటమునగలదు. దానిని శత్రువుల జలాంతర్గాముల ప్రమాదంనుండి తప్పించి అతిదూరం సముద్రాలనుండి మూడు స్టీమరులు యీడ్చుకొని వచ్చినవి. దానిని శత్రువిమానాలనుండి కాపాడుటకై పైన ఎగురవేసే బెలూనులను నావికులు తయారుచేయుట యిందు కానవగును.

## గట్టుదాటి పోయినాము.

### "జపానీయులు ఇండియాకు రారు."

మదరాసు గవర్నరుగారి ప్రవచనాలు.

మదరాసు గవర్నరు సర్ ఆర్థరు హోపుగారు తిరువాంద్రంలో నవంబరు 6 వ తేదిన ఉపన్యశిస్తు యిట్లు తెలిపిరి :—

"జపానువారు ఇండియాలో లేరు. వారెప్పటికి ఇండియాకు రాలేరనియే నేను చెప్ప గలను. వారు కొంచెందూరం లోపలికి రాగలిగినా, భారతీయ సైన్యం బ్రిటిషు సైన్యం చేతనేగాక, భారతీయ ప్రజలందరి ద్వేషం శత్రుత్వంచేత తరిమివేయబడుదురు.

"మన మిపుడు యుద్ధములో గట్టు దాటిపోయితిమని నేను పూర్తిగ నమ్ము చున్నాను. క్రిష్టమసులోగాగాని, ఈష్టరు (ఏప్రిలు) లోగాగాని మనం యుద్ధంలో విజయం పొందుతామని నేననను, కాని ఆ గమ్యస్థానం చేరుటకు అడ్డంకులు దాటి మరపు తిరిగితిమని నేను నమ్ముచున్నాను."

# మదరాసు స్క్వాడ్రను.

## నవనగరు మహారాజు ప్రశంస.

నవనగరు మహారాజు జాం సాహేబుగారు ప్రస్తుతం ఇంగ్లాండులో నున్నవారు మదరాసు గవర్నరుగారికి యిట్లు వ్రాసిరి :—

"నేనిటీవల ఇంగ్లాండులో మదరాసు స్క్వాడ్రను (విమానదళం) చూచితిని. వారు చాల అద్భుతమగు కార్యములను చేసిరి, చేస్తున్నారు. మీ రాష్ట్రం పేరు పెట్టుకొనుటకు వారెంతో గర్వపడుచున్నారు. వారి అభివందనాలు మీకు పంపెదనని నేను చెప్పియుంటిని."

మదరాసు గవర్నరుగారి జబాబు.

"మీరు పంపిన అభినందన సందేశములకై మదరాసు ప్రజలు కృతజ్ఞత దెల్పుచున్నారని మదరాసు స్క్వాడ్రనుకి తెలుపగోరెదను వారి ఘనకార్యములను శ్రద్ధతో సగర్వంగా పరికించుచున్నాము. మీరు వారిని చూచినందుకు కూడ సంతసించుచున్నాము."

[2 వ పేజి తరువాయి]

నిర్ణయించుటకు 3 గురు అమెరికనులు, 3 గురు బ్రిటిషు సైనికోద్యోగులు గల చీఫ్ ఆఫ్ స్టాఫ్ కమిటీ వాషింగుటనులో 1942 జూనులో స్థాపించబడెను. రష్యాలో యుద్ధమును దాడులు సాగించుటకును రష్యనులకు ఇంగ్లాండు-అమెరికాల సహాయం అక్కరలేదు, కనుక మాస్కోనగరంలో సమిష్టి సంఘంలేదు. కాని మాస్కోలో బ్రిటిషు-అమెరికను సైనిక ప్రతినిధులు, లండను వాషింగుటను నగరాలలో రష్యా ప్రతినిధులు ఉన్నారు. చర్చిలు ప్రధాని ఆగస్టులో మాస్కో-పోవడంవలన ఉభయులు సమాచారాలు తెలుపుకొని ఒండొరులు సహాయం చేసుకొనుటేగాక కలిసివ్యూహం పన్నుటగూడ చేస్తున్నారనుటకు నిదర్శనం. పశిఫికు యుద్ధరంగంగూర్చి లండను వాషింగుటను నగరాలు రెండింటిలో సమావేశమవుతూనుండు ప్రత్యేక యుద్ధ సంఘం ఒకటి స్థాపించబడెను. చీనా ప్రతినిధులుగూడ అందు గలరు. చీనా అధ్యక్షుడు సేనానాయకుడగు చియంగుకాయిషేకుగారికి అమెరికా సేనానియగు జనరలు స్టిలువెలుగారు ప్రధాన సేనానిగా నియమించబడుటచే చీనాతో జోస్తీ యెక్కువయింది. చియంగుషేకుగారు, వావెలు సేనాని, జనరలు స్టిలువెలుగార్లందరు తరుచు కలుస్తూవుండడం వలన చీనాతో సన్నిహితత్వ మేర్పడెను.

యుద్ధ పరికరాలు ఉత్పత్తి చేసిపంచుటకు గూడ చాల సమిష్టి సంఘాలు యేర్పరచబడెను. ఈసమిష్టి ఆలోచనల ఫలితంగానే బ్రిటను ఫైటరు విమానాలనుమాత్రం, అమెరికా బాంబరు విమానాలనుమాత్రం తయారుచేస్తున్నవి. మందుగుండు, నౌకలు ఆహారపదార్థములన్నింటికి వేరువేరుగ సమిష్టిసంఘాలు (బోర్డ్సు) స్థాపింపబడియున్నవి.

అమెరికావారనుసరించిన అరువుకౌలు చట్టం ఇంగ్లాండు-అమెరికాలు రెండింటికి లాభించెను. 1942 వ సం॥ మార్చి 3 వ తేది సరికి అమెరికా మొత్తం 12,561,000 పౌనుల విలువవరకు ఇంగ్లాండునకు సహాయం చేయవచ్చునని తీర్మానించెను. ఇంగ్లాండే కాక అమెరికా సహాయం యీ విధంగా యింకో 36 తటస్థ రాజ్యాలు పొందవచ్చును.

**యుద్ధానంతరం.** సంయుక్త రాజ్యాల సఖ్యత సహకారములు యుద్ధ సమయంలోనేగాక యుద్ధానంతరంకూడ వ్యాపించును. యుద్ధానంతర రాజకీయ, ఆర్థిక, సైనిక సహకారములుగూర్చి ప్లానులు అపుడే వేసిరి. అట్లాంటికు ప్రణాళికయు, యుద్ధానంతరం 20 సంవత్సరములవరకు అన్యోన్య సహకారఒడంబడికయగు ఇంగ్లాండు రష్యా ఒడంబడికయు, యుద్ధానంతరావసరాల నిర్ణయించు మిత్రరాజ్యాల సంఘం, మిత్రరాజ్యాల గోధుమ సంగ్రహ సంఘము యివన్నీ, యీ సహకారమునకు నిదర్శనములు. మిత్రమండలి సఖ్యత సహకారములను, దృఢపరచు యిన్ని నిదర్శనాలుండి, యిదివరకు ప్రపంచ చరిత్రలో నెచట కని విని యెరుగని కార్యాలు జరుగుతూ వుంటే శత్రురాజ్యాల అసత్య ప్రచారం ఎవరు నమ్ముతారు.

# ఉత్తరాఫ్రికాలో అమెరికా సేనల విజయం.

## ఈజిప్టులో రోమెలు పతనం.

### అంత్యవిజయాన్ని చేరువచేసే ఘట్టాలు

చర్చిలు ప్రధాని లండను లార్డుమేయరు విందులో మంగళవారంనాడు ఉపన్యశిస్తు ఈజిప్టులో శత్రుసేనల ఓటమిగూర్చి నుడివెను, "రోమెలు సైన్యం పూర్తిగ తరిమివేయబడింది, ఎక్కువ భాగం నాశనం చేయబడింది. తిరిగి తల ఎత్తనేరదు. ఓడితే మిక్కిలి ప్రమాదంగానుండే ప్రధానమగు స్థలమునందే శత్రుసేనలను పూర్తిగ నిర్మూలించాలన్న పట్టుదలతో యుద్ధం జరిగింది" అని చెప్పి ప్రధాని ఆ యుద్ధంలో పాల్గొన్న భారతీయ సేనలు, ఫ్రెంచి, గ్రీకు జకు సైనికులందరిని అభినందించిరి. అమెరికా విమానాల విలువలేని సహాయమును ప్రశంసించిరి. ఈ యీజిప్టు యుద్ధం ఫ్రెంచి ఉత్తరాఫ్రికాలో అమెరికనుల దాడికి ప్రాతిపదికముగ నుండుటకై, మంచి సమయములో తలపెట్టబడింది. "అమెరికా అధ్యక్షుడు దీనిని తలపెట్టిన సేనాని, నేను అతని ననుసరించిన లెఫ్టినెంటును. ఆఫ్రికాలోని యీ రెండు చర్యలు చాలముఖ్యమయిన వ్యూహమునకు సంబంధించినవి. చాల కాలము క్రిందటనే యోచించి నిర్ణయింపబడి యిపుడు అమలు జరుపబడినవ"ని చర్చిలుగారనిరి.

ఇందు మొదటిదగు ఈజిప్టు యుద్ధంగూర్చి కొంచెం వివరంగా తెలుసుకుందాం. బ్రిటిషు సేనానియగు జనరలు మాంటుగోమరీగారు రోమెలు సేనలపై ఎల్ అలామీనునుండి గత నెల 23 వ తేదీన ప్రారంభించిన దాడి క్రొత్త పద్ధతుల ననుసరించిందే కాని గత యుద్ధంలో 1916-18 వ సంవత్సరములందు అనుసరింపబడిందే. అలగ్జాండ్రియా వైపు దాడి ప్రారంభించి ఎల్ అలమీనువద్ద నిలుపబడినప్పటినుండియు జర్మనులు తమ రక్షణశ్రేణులను దిట్టపరచుకొనుచుండిరి. బ్రిటిషు సేనలకు వారిపై బోవుటకు సన్నని మార్గం ఒకటి సముద్రానికి క్వెట్టారా గోతులకు నడుమనుండెను. అట్టి సమయాలలో ఎడారి యుద్ధమునందు యింకో వైపునుండి సేనలుపోయి శత్రువు వెనుకభాగంనుండి ఒత్తిడి చేయుట మామూలు. కాని మాంటిగోమరీగారట్లు చేయక, పైన విమానాలు గొడుగువలె కాచుచుండగ దిగువకు కాల్బలమును టాంకులను ఒక్కుమ్మడిగ పోనిచ్చి శత్రువుపై ఎదురుదాడి తీవ్రముగ సాగించెను. శత్రుసేనలు తట్టుకోలేక పారిపోయెను. ఆ విధముగ పరుగెత్తిపోవుటకు ప్రారంభించిన శత్రుసేనలలో కొన్ని ఈనెల 9 వ తేదీకి, ఈజిప్టు సరిహద్దులను దాటి లిబియాలోనికి పోయినని. మిత్రసేనలచట గూడ వెంటబెట్టి వెనుకకు తరుముచున్నవి.

కాని ఈ పలాయనమున శత్రువులు తమ సైనికులను, ఆయుధ సామగ్రిని అత్యధిక భాగమును కోల్పోయిరి. షుమారు 40 వేల అక్ష సేనలు ఇంతవరకు మిత్రబలములచే ఖైదీలుగా పట్టుకొనబడిరి. వేలకొలది ఫిరంగులు, వందల కొలది టాంకులు పట్టుకొనబడెను. 600 శత్రు విమానములు నిర్మూలింపబడెను. ఈజిప్టునందు లక్షకుపైగాగల శత్రుబలములలో షుమారు 20 వేలకంటె ఎక్కువ ఈజిప్టు సరిహద్దునుండి తప్పించుకొని పోలేదు.

రోమెలు సేనాని హతశేషమైన స్వల్ప బలముల్తో లిబియానుచేరినను అది మిత్రబలముల నెదిర్చి నిలచిపోరాడుట కేమాత్రమును చాలదు. శత్రులవెంట తరుముచున్న మిత్రసేనలు, హతశేషమగు శత్రుబలములను పూర్తిగ నిర్మూలించి, లిబియానంతనుగూడ ఆక్రమించుకొని ఉత్తరాఫ్రికాలో శత్రులు కాలూనుటకు అవకాశములేకుండ జేయుటకు ప్రయత్నించుచున్నాయి. ఆ ప్రయత్నము పూర్తిగ సఫలమవడానికి ఎక్కువ కాలము పట్టదు.

### అమెరికా సేనల ఫ్రెంచి ఆఫ్రికా దాడి.

ఇక ఆఫ్రికాలో రెండో రంగంగూర్చి తెలుసుకుందాం; ఈ నెల 7 వ తేది రాత్రి అమెరికను నౌకా విమానబలములు, ఫ్రెంచివారి ఉత్తరాఫ్రికా తీరములందు సేనల దింపుటకు ప్రారంభించేయి. బ్రిటిషు నౌకా విమానబలములు గూడ అమెరికనులకు తోడ్పడుచుండెను. ఆదివారమునాడు

ఉదయమునకు ఉత్తరాఫ్రికా అట్లాంటికు తీరము నందలి కెసబ్లాంకా అను రేవువద్దను, మరికొన్ని ఇతర రేవులవద్దను, మధ్యధరా సముద్ర తీరము నందలి 'ఓరన్', 'ఆల్జియర్సు' మొదలగు రేవు లవద్దను, షుమారు 140 వేల సేనలు దింపబడెను.

ఫ్రెంచి అధికారులును, జర్మనీ నాయకులును గూడ, అమెరికా-బ్రిటనులు, ఈ విధంగా ఫ్రెంచి ఆఫ్రికాను ఆక్రమించునని, ఏమాత్రం వూహించు కో లేకపోయారు. అందుచే, అక్ష విమానాలు గాని జలాంతర్గాములుగాని, మిత్రసేనలను అడ్డ గించుటకు ఏమాత్రం ప్రయత్నింపలేదు.

మిత్రమండలి చర్య, ఫ్రెంచి ప్రభుత్వ నాయ కుడగు మార్షల్ పెటాన్‌కు ఆగ్రహం గల్గిం చింది. ఫ్రాన్సుకు - అమెరికాకు ఇంతవరకును గల రాజకీయ సంబంధాలను తెగగొట్టుతూ, పెటాన్ సేనాని వుత్తరువులుగూడా చేశాడు; ఆఫ్రికాలో షుమారు ఒక లక్షకంటె ఫ్రెంచివారి కెక్కువ సేనలేదు. వారికి ఆధునికాయుధ పరికరాలు అంతకంటె లేవు, కనుక ఫ్రెంచి బలాలు, ఎక్కువ కాలం మిత్ర సేనలను ప్రతిఘటింప లేవు. అమెరికను సేనలు, అపుడే, అట్లాంటిక్ తీరపు రేవులను, మధ్యధరా సముద్ర తీరమునందలి ఓరాన్, ఆల్జియర్సు రేవులను ఆక్రమించుకున్నాయి. టునీసియా రాష్ట్రమును ప్రవేశించి, అచటనున్న 'బిజార్టా' రేవును, టూనిస్ నగ రాన్ని స్వాధీన చేసుకోడానికి పోతున్నాయి. ఉత్త రాఫ్రికా తీరాన్నంతా ఆక్రమించుటకిక మిత్ర సే నలకి కొలది రోజులకంటె ఎక్కువ కాలం పట్టదు.

ఫ్రెంచి ఉత్తరాఫ్రికా తీరాన్ని ఈ విధంగా మిత్ర సేనలు ఆక్రమించుకోడంవలన, అక్ష రాజ్యాల స్థితి, చాలా క్లిష్టమవుతుంది.

లిబియాలో తూర్పు సరిహద్దుల వైపున - ఈజిప్టునందలి మిత్రసేనలు ఈ సరికే అక్ష సేన లను తరుముకొని వస్తున్నాయి. టునీసియా లిబియాకు పడమటి వైపునవున్నది. టునీసియా నుండిగూడా ఇపుడు మిత్ర సేనలు లిబియామీదకు దండయాత్ర సాగించగల్గితే-రెండు వైపులనుండీ వచ్చు మిత్ర సేనలమధ్య - శత్రువులు పూర్తిగా చిక్కుకోవలసివుంది.

ఉత్తర ఆఫ్రికా తీరమంతా ఈ విధంగా మిత్ర రాజ్యాలక్రిందకు వస్తే - మధ్యధరా సముద్రము అంతా, మిత్ర నౌకలు ఇక స్వేచ్ఛగా విహరింప వచ్చు. అట్లాంటిక్ సముద్ర ప్రాంతమునుండి, ఈజిప్టు మొదలగు మధ్య ప్రాచ్య దేశములకు నూ, ఇండియా, బర్మా మొదలగు తూర్పు దేశా లకునూగూడ మరలదగ్గర రహదారీ ఏర్పడు తుంది.

అంతేగాక, ఉత్తరాఫ్రికా తీరపు రేవులనుండి విమానాశ్రయలనుండి, మిత్ర విమానములు, యుద్ధ నౌకలు ఇకమీద ఇటలీమీద బాల్కను తీర ములందలి శత్రు ఆక్రమిత రేవులుమీద దాడులను సాగించి, నష్టం కలిగించవచ్చు! ఇటలీ రాజ్యం లో ఒక భాగమగు సిసిలీదీవి, ఉత్తరాఫ్రికా తీరా నికి 80 మైళ్ల దూరంలోనేవుంది. మిత్ర రాజ్యా లు, కొలది రోజులలోనే, ఆదీవిలో సేనలను దింపి, ఇటలీపై దండయాత్రను సాగించుటగూడా కష్టం గాదు. కాలక్రమేణా మిత్ర ప్రభుత్వాలు, బాల్కను రాష్ట్రములలోగూడ సేనలను ఒంపి, అచట ప్రజల సహాయంతో, అక్ష సేనలను వెడల గొట్టి, ఐరోపాలోనే, ఆ నాజీలను, నిర్మూలించి సంపూర్ణమగు విజయమును పొందవచ్చును.

నేడు ఆఫ్రికాలో స్థితి సంగ్రహంగా యిట్లు చెప్పవచ్చును. రోమెలు సేనలు పూర్తిగ తరిమి వేయబడినవి. ఎల్ అలామీను యుద్ధం పూర్తిగ మిత్రమండలికి విజయవంతగా ముగిసింది. కాని లిబియా ఎడారి యుద్ధం యింకా ముగియలేదు. విశేష నష్టం కలిగినా రోమెలు సేనకు తిరిగి కొట్టే శక్తి లేకపోలేదు. అక్ష రాజ్యాల క్రొత్త సహాయ సేనలు యింకా వస్తున్నాయి. మిత్ర సేనలు పడమటకు దూరంపోయిన కొలది మూల స్థానానికి దూరమయి సప్లైలందుట కష్టమగు శత్రు సేనలకు తమ స్వంత మూల స్థానములు చేరువగును. ప్రస్తుతానికి ఈజిప్టునకు ప్రమాదం తొలగింది. మిత్రమండలి సేనలు గొప్ప విజ యమును బడసినవి. లిబియాకు పడమరను దిగిన అమెరికా సేనలు త్వరగ త్రోసుక రాగల్గిన చో ఆఫ్రికానుండి శత్రువు పూర్తిగ నిర్మూలింప బడి అంత్య విజయం సులభసాధ్యమగును.



# రా మేలు కాదు పో మేలు.

"వస్తూ పోతూ ఉంటే బాంధవ్యం ; ఇస్తూ తెస్తూ ఉంటే వ్యాపారం" అనే సంగతి లోక విదితమైన విషయం. కాని యీసంగతి హిట్లరు గ్రహించలేదు. అందుకనే జర్మనీకి ఇతర రాజ్యాలతో ఉండే పరస్పర వ్యాపారం పాడు చేశాడు. అంతర్జాతీయ వ్యాపారమే కాకుండా అంతర్జాతీయ బంధుత్వంకూడా చెడగొట్టినాడు. నా జర్మనీ రాజ్యంకంటె బలమైన రాజ్యం ఇంకొకటి లేదనే గర్వంతో హిట్లరు మొదటినుంచీ విర్రవీగుతూనే ఉన్నాడు. నా జర్మను జాతి కంటె తెలివిగల సమర్థమైన జాతి ఇంకొకటి నీని వృద్ధిలోనికి రానీయకుండా లోకమంతా ఏకమై ఎదురుతిరిగి ప్రతికూలంగా పనిచేస్తున్న దనే భావం హిట్లరుకు కలిగింది. కనుక యీ లోకంలో ఉన్న ఇతర రాజ్యాలవాళ్లందరూ మన మేలుకోరని శత్రువులే అని తీర్మానించు కొన్నాడు.

అయితే, ఎవరైనా ఒక ప్రశ్న అడుగవచ్చు. జపాను దేశమునున్నూ, ఇటలీ దేశమునున్నూ హిట్లరు తన మిత్ర రాజ్యాలుగా అంగీకరించి యున్నాడు గనుక హిట్లరుకు ఇష్టులైన బంధువులు లోకంలో కొందరు ఉన్నారని ఒప్పుకో

# మీరు జపానుభాష మాట్లాడుదురా ?

చాలమంది మాట్లాడుచున్నారు.

ఎవ్విధమైన శాంతి లేకుండ చేయుచు,

మార్కెటులందు ధరలు అకారణంగా హెచ్చు తగ్గులు అగునట్లు,

ప్రతి వ్యక్తికి కొంత అనవసరమగు నష్టము కలుగునట్లు,

ఘోరమైన పుకారులను పునశ్చరణ చేయుచున్నారు.

ఈ పుకారులు జపానునుండి వచ్చుచున్నవి.

వానిని లక్ష్యం చేయకండి.

వానిని వ్యాపింప జేయకండి.

## * పుకారుల నమ్మకుడు *



జపానును ఎదుర్కొనుటకు దేశీయ యుద్ధ రంగమును తయారుచేయుడు.

ప్రపంచంలో లేదని హిట్లరు సవాలుచేస్తూ ఉన్నాడు. ఇంత గర్వంతో విర్రవీగుతూ ఉండడం వల్లనే, జర్మనీకి తగినంత వ్యాపార లాభైశ్వర్యం లభించకపోవడం జర్మనీయొక్క లోపంకాదనిన్నీ ఇతర రాజ్యాలు చేస్తున్న దుర్మార్గమే అనిన్నీ హిట్లరు తీర్మానించుకున్నాడు. తనయందు లోపం ఉండదనేవానికి కోపం హెచ్చుగా ఉంటుంది. జర్మనీకి పేరు ప్రతిష్ఠలు ప్రపంచంలోని ఇతర రాజ్యాలకంటె ఎక్కువగా ఉండవలసినప్పటికీ ఉండకపోవడం తన జర్మను జాతియొక్క అసమర్థతవల్ల కాదని హిట్లరు వాదించాడు. ఇతర రాజ్యాల అక్రమంవల్లనె తన జర్మను జాతికి జగత్ప్రఖ్యాతి రావడంలేదని సిద్ధాంతీకరించాడు. జర్మ వలెనా ? అక్కరలేదా ? ఈ ప్రశ్న ముఖ్యంగా అడుగవలసినదే. ఈ ధర్మసందేహం తీరవలెనంటే, హిట్లరు ఇదివరలో వ్రాసిన గ్రంథాలున్నూ, పూర్వముచేసిన ప్రసంగములున్నూ చదివి చూడాలి. జపానుజాతిని హిట్లరు ద్వేషించినట్లుగా ఇంకెవ్వరూ ద్వేషించలేదు. జపానువాళ్లు మెదడులేని బోడి జాతి అన్నాడు. కుక్కమూతి పిందలవంటి పొట్టి బుడంకాయ లన్నాడు. జపానువాళ్లుకూడా ఒక జాతి మనుష్యులేనా ? అని శంకించాడు. హిట్లరు వ్రాసిన గ్రంథం లోనే యీ విధంగా వ్రాసినాడు. ఇక ఇటలీ సంగతి పరిశీలించిచూస్తే, ప్రారంభదశలో హిట్లరును మనసులోనే ద్వేషించాడు, దూషించాడు.

ఇటలీలోని ఫాసిస్టు తత్వానికీ జర్మనీలోని నాజీ తత్వానికీ ఇదివరకెన్నడు శ్రుతి కలియలేదు. ముసలోనీ యిదివరలో ఏ విధంగా నాజీతత్వాన్నీ హిట్లరునున్నూ ద్వేషించాడో ముసలోనియొక్క వెనుకటి ఉపన్యాసాలు చదివిచూస్తే స్పష్టంగా బోధపడుతుంది. ఈ రోజున జపానువాళ్లను "భాయి! భాయి!" అని హిట్లరు తన అవసరం చేత అనినంతమాత్రమున, జపానుమీద హిట్లరుకు ద్వేషం లేదని భ్రమపడకూడదు. ఈ నాడు ఇటలీకిన్ని, జర్మనీకిన్ని ఉన్నటువంటి స్నేహ బంధాన్ని బ్రహ్మరుద్రాదులుకూడా భేదించలేరని హిట్లరు ప్రగల్భాలు ఎన్ని పల్కినప్పటికీ, ముసలోనీ తన అర్ధాంగి అనే భావంతో యీ హిట్లరు బ్రహ్మచారి మాట్లాడడంలేదు. ఇటలీవాళ్లను జర్మనులు అభిమానించి శిరసావహించడంలేదు. ఇటలీవాళ్లకూడా జర్మనులను నమ్మి సంచరించడం లేదు. ఈ హిట్లరు బ్రహ్మచారియొక్క పాద తీర్థాన్ని శిరస్సున జల్లుకుంటాము అనే భావంతో ఇటాలియనులుకూడా ప్రవర్తించడంలేదు. ఇటలీలోని కాథలిక్కు మతస్థులను హిట్లరు తృణీకరించాడు.

ఎవరియందు ఎవరి కెంత అభిమానం ఉన్నదో కార్యరంగంలోకి దిగిన తర్వాతనే స్పష్టమవుతుంది. ఇప్పుడు యీజిప్టులో జరుగుతున్న యుద్ధంచూస్తే పై జెప్పిన విషయం స్పష్టమవుతుంది. ఇటీవల యీజిప్టులో బ్రిటిష్‌వారి అష్టమ సైన్యంసర్వసన్నాహంగాదండయాత్రసాగించింది. శత్రుసేనలు తోక ముడతపెట్టి చిందరవందరగా పరుగెత్తి, బ్రతికి ఉంటే బలుసాకు అయినా తిన వచ్చురా అని పలాయన మంత్రం జపిస్తున్నాయి. గత పదిరోజుల యుద్ధంలో శత్రుసేనలు యీజిప్టు దాటి లిబియాలోనికి పారిపోయినవి. ఈజిప్టు సరిహద్దులను దాటి లిబియాలోనికి పోవలనంటే శత్రుసేనలు హాల్ఫియా అనే కొండ కనుమ గుండా పోవాలి. రెండు పర్వతముల మధ్యగా పోయే సన్నని మార్గం అది—ఆ కొండ కనుమ గుండా సేనలు పోతూ ఉన్నప్పుడు, పైన ఆకాశములోనుండి మిత్రవిమానాలు అగ్నివర్షం కురిపిస్తున్నాయి. ఆ కొండ కనుమమార్గంలో పోయే సేనలుగాని, మిలిటరీ మోటారు లారీలుగాని, అక్కడే నాశనం కావాలికాని, ఆ కొండ కనుమదాటి తప్పించుకొని పోలేవు. నరకద్వారమైనా దాటి రావచ్చునేమో గాని, హాల్ఫియా కొండమార్గం దాటి తప్పించుకొనడం చాలా అసాధ్యమైనపని. అందువల్ల దానికి నరక ద్వారమనే పేరు వచ్చింది. ఈ నరక ద్వారంలోనుంచి పోతేనేగాని, శత్రుసేనలు యీజిప్టు దాటి లిబియాలోనికి చేరజాలవు. ఈ నరక ద్వారంమీదనే ఈ రోజున మిత్రమండలి విమానాలు అహోరాత్రాలు బాంబులువేసి అగ్నివర్షం కురిపిస్తున్నాయి.

రామేలు సేనానియొక్క జర్మను సేనలు యీ రోజున హాల్ఫియా కనుమగుండా. ఆ నరక ద్వారంలోనుంచి తప్పించుకొని, కన్ను లొట్ట పోయినా చావు తప్పితే చాలునని పారిపోవుటకు విశ్వప్రయత్నం చేస్తున్నవి. రామేలు సేనానియొక్క జర్మను పటాలములతో సహా ఇటాలియను సేనలుకూడా ఇంతకాలంనుంచీ అక్కడ యీజిప్టులో యుద్ధం చేస్తున్నాయి. కనుక, పారిపోవుచున్న శత్రు సేనలలో జర్మను పటాలములున్ను, ఇటాలియను పటాలములున్ను చేరి యున్నవి. కాని, "బ్రతుకు జీవుడా!" అని పారిపోయే సందర్భంలో ఇటాలియను సేనలను ముందు నిలువబెట్టి బ్రిటిష్ సేనతో పోరాడుతూ వుండవలసినదని రామేలు సేనాని ఆజ్ఞాపించి నియమించాడు. ముందున్న ఇటాలియను సేనలు బ్రిటిష్ సేనతో పోరాడుతూ బ్రిటిష్ సేనను కొంచెం అడ్డగిస్తూ ఉండే సమయంలో వెనుకనున్న జర్మను పటాలములు వెనుకంజవేసి వేవేగంగా పారిపోవుట సాగించినవి. ముందుండి పోరాడుతున్న ఇటలీ సేనలతోబాటు జర్మను పటాలములుకూడా అండగాఉండి పోరాటమునకు సిద్ధముకాకుండా, పారిపోవుటకు సిద్ధమవుతూ ఉన్నవి. ఈ మిత్రద్రోహమును ఇటలీ సైన్యాలు గ్రహించినవి. వెనుకనున్న తమ మిత్రులగు జర్మనులే ఆఖరుకు తమకు ద్రోహంచేసి పారిపోతూఉంటే, ఇటాలియను సేన లిక పోరాడుటకు సాధ్యముకాదని నిర్ణయించుకొన్నవి. ఒక్కొక్క డివిజను సేనలో రమారమి 20 వేల మంది సైనికు లుంటారు. అటువంటివి ఆరు ఇటాలియను డివిజనుల సేన బ్రిటిష్‌వారికి లొంగిపోవుటయే ఉత్తమమని ఎంచి లొంగిపోయినది. రమారమి లక్షమంది ఇటాలియను సైనికులు ఒక్క వారంరోజుల యుద్ధంలో బ్రిటిష్‌వారికి లొంగిపోయినారు. ఇంతపెద్ద ఇటాలియను సైన్యం ఇంత స్వల్పకాలంలో అస్త్రసన్యాసం చేసినట్లుగా కత్తి కిందపెట్టి బ్రిటిష్‌వారికి లొంగిపోవుటకు కారణమేమిటి? ఇటాలియనులను యుద్ధరం

గంలో ముందుకుత్రోసి, జర్మనులు వెనుకనుంచి భద్రంగా పారిపోవడమే కారణం. ఇటాలియను సేనయెడల జర్మను సేనానియగు రామేలు సేనాని చేసిన ద్రోహమే కారణం. కాబట్టి, పరీక్షసమయంవస్తే, వారికీ వీరికీ ఉన్న స్నేహ బాంధవ్యం ఎటువంటిదో, బండారం బయటపడుతుంది.

ఇటువంటి ద్రోహబుద్ధితో రామేలు సేనాని, ఇటలీ పటాలములయెడల ప్రవర్తిస్తూ ఉంటే, ఇటలీలో ఉన్న మసులోనీకి యీవిషయం బాగా అర్థమవుతూఉంది. హిట్లరును యీ విషయమై ప్రశ్నించి; "రామేలుచేసిన ద్రోహానికి ఏమి సమాధానం చెప్పగలవు?" అని మసులోనీ అడుగుతాడా లేదా? హిట్లరున్నూ మసులోనీ యున్నూ త్వరలోనే కలిసికొని ఒక పర్యాయం మాట్లాడుకొన బోవుచున్నారనికూడా మొన్ననే వార్తవచ్చింది. హిట్లరు మొన్న నీమధ్య నాజీ పార్టీ సమావేశంలో ఉపన్యసిస్తూ ఒక దివ్యమైన మాట అన్నాడు. "ఉత్తరాఫ్రికాలో మా శత్రువులు (అనగా బ్రిటిష్‌వారు) ముందుకు వచ్చినారు. మేము వెనుకకు పోయినాము. కాని, మనము చూచుకోవలసినది యుద్ధాంత్యసర్యవసానమే . ప్రతి వారమున్నూ, క్రొత్త విజయములను సాధిస్తూ ఉండడం అసంభవం. ఆ విధంగా విజయములను సాధిస్తూ ఉండడం అనవసరం. మన జర్మనీ దేశము చావడమో బ్రతకడమో నిర్ణయించుకోవలసిన మహాసమరములో దిగియున్నాము. జర్మనీ దేశస్థుడైన ప్రతివాడున్నూ నన్ను నమ్మియుండవలెను. ఆ నమ్మకము ముందువెనుకలుచూడని భక్త్యావేశంగా ఉండాలి." సెబాస్! హిట్లరు తన జర్మను ప్రజలకు చాలామంచి ధైర్యవచనాలు చెప్పాడు.

అవును నిజమే. జర్మను సేనలు ఎప్పుడూ జయిస్తూ ఉండడం అనవసరమే! ఇంతవరకూ జర్మను సేనలు ముందుకు దండెత్తివచ్చినవి గనుక ఇకముందు జర్మను సేనలు వెనుకకు పరుగెత్తిపోతూ ఉండడమే మంచిది. రష్యాలో వాన్‌బాక్ అనే జర్మను సేనాని స్టాలినుగ్రాడు నగరాన్ని జయించలేకపోయినాడు. అందువల్ల ఆ జర్మను సేనాధిపతిని తొలగించి వాన్‌హాత్ అనే జర్మను సేనాధిపతిని అక్కడ హిట్లరు నియమించాడు. రష్యాలో జర్మను యుద్ధయాత్ర ఇక యీ శీతకాలంలో ముందుకు సాగదనికూడా హిట్లరు మొన్న ఉపన్యాసంలో చెప్పియున్నాడు. జయించిన దానిని జాగ్రత్తచేసికొనడమే ఇక జర్మను సేనల పని అన్నాడు. ప్రారంభంలో స్టాలినుగ్రాడుమీదకు దండెత్తుట వాన్‌బాక్ సేనాని పని అన్నాడు. ఇప్పుడు జర్మను సేనలకు చలనం లేకుండా చేయుట వాన్‌హాత్ చేయవలసిన పని అన్నాడు. అదేవిధంగా ఉత్తరాఫ్రికాలోకూడా, రామేలు సేనాధిపతిని తొలగించి, ప్రస్తుతం జర్మనుసేనలు అక్కడ సాగించుచున్న కొత్త యుద్ధతంత్రం బాగాతెలిసిన మరొక కొత్త జర్మను సేనాధిపతిని హిట్లరు నియమించవలసి ఉంటుంది. ఎందుచేతనంటే, హిట్లరు ప్రసంగంలో చెప్పిన ప్రకారంగా ఇప్పుడు జర్మనులు జయించడం జర్మనీకి మేలుకాదు. వీలైనంతవరకు జయించినది వదలిపెట్టిపోతూ ఉండడమే జర్మనీకి శ్రేయస్కరం. జర్మను సేనలు ముందుకు దండెత్తి రావడం మేలుకాదు. వెనుకకు పోవడం మేలు. ముందుకురావడం మేలుకాదనే అభిప్రాయంతోనే, జర్మను సేనలు ఉత్తరాఫ్రికాలో వెనుకకు పోవడం ఉత్తమమని నిశ్చయించుకున్నవి. ముందుకు రా మేలుకాదనే విషయం రామేలు సేనాని ఇంకా గ్రహించాడో లేదో. వెనుకకు పో మేలు అనే విషయం హిట్లరు మాత్రం గ్రహించాడు. కనుక రామేలు అనే సేనాధిపతికి బదులుగా అతని స్థానే పోమేలు అనే సేనాధిపతిని ఆఫ్రికాలో హిట్లరు నియమించడం ఉత్తమం.

కాని, తూర్పునుంచి తరుముకొనివచ్చే బ్రిటిష్ సేనల ధాటికి నిలువలేక జర్మను సేనలు వెనుకకు పడమరగా పారిపోతూవుంటే, అటు పడమటి నుంచి ఆల్జీరియా మొరాకోల మీదుగా అమెరికను సేనలు దండెత్తి వస్తున్నాయి. అటు పడమట నుంచి అమెరికను సేనలున్నూ, ఇటు తూర్పు నుంచి బ్రిటిష్ సేనలున్నూ తరుముతూ ఉంటే అడకత్తెరలోనున్న పోకచెక్కవలె మధ్యనున్న జర్మను సేన ఎక్కడికి పోగలదు? జర్మనులు ఇంతకు పూర్వం జయించి ఆక్రమించిన ప్రాంతం విడిచిపోవడమే మేలు అనుకున్నారు. కాని యిప్పుడు జర్మను సేనలు ప్రాణాలు విడిచి యీ లోకం విడిచిపోవడమే మేలు అనే స్థితి ఏర్పడింది. ఎట్లానైనా జర్మను సేనలకు ఇక యుద్ధానికి రా మేలుకాదు పో మేలు అనే మాట నిశ్చయం. అందుకనే హాల్ఫియా కొండకనుమ అనే నరకద్వారంలోకి జర్మను సేనలు ప్రస్తుతం ప్రవేశించినవి.

# రష్యా వైమానికురాలు.

## గాయపడినను తన పని మానలేదు

వి. నక్రసోవుగారు యిట్లు వ్రాయుచున్నారు :—

" మానాయకురాలిని చూతువుగాని రమ్ము " అని స్క్వాడ్రను కమాండరు వైమానికుల నివాసమగు మేడమెట్లెక్కుచూ నాతో అనెను.

మేమొక చిన్న గదిలోనికి పోతిమి. అందు నాల్గు పరుపులు మంచువంటి తెల్లని వస్త్రములు పరచియున్నవి. కిటికీ తెరలు, అద్దాలు, వాసన ద్రవ్యాలను బట్టి అది యొక స్త్రీ గదియని స్పష్టమయింది. మధ్యనున్న బల్లవద్దనుండి లేచి పాతికేండ్ల స్త్రీ కాకీ పరికిణీ, నీలం జాకెటుతో మావద్దకు వచ్చి పలకరించింది. ఆమె జాకెట్టుపై సైనిక బిరుదు చిహ్నములు రెండు కనబడుతున్నాయి.

" ఈమె యే మారుషియా చికిరవ, మావైమానిక దళం తల మానిక్యం " అని కమాండరనెను. " అంతేసి మాటలెందుకు, కామ్రేడు కమాండరు " అని ఆమె అంటూ నీలపు కళ్లు క్రిందకు దించెను. సిగ్గుతో ఆమె బుగ్గ లెర్రబడెను.

కాని త్వరలో ఆమె సిగ్గు మాయమయ్యెను.

సైన్యంలో చేరుట

మేము మిత్రులమై మాట్లాడితిమి. ఆమె తన వైమానిక జీవిత విశేషములను యీ దిగువరీతి తెలిపెను.

సోవియటు యూనియను రాజ్యంలో మరుషియావంటి యువతులు వేలకు వేలుగలరు. ఆమె మొదట ఒక అద్దాల కంపెనీలో అద్దాలు సాపు చేయు పనిమనిషిగానుండి, తీరిక సమయాలందు విమానాలు నడపడం నేర్చుకొనుచుండెను, తరువాత వైమానిక పాఠశాలయందుచేరి, రేడియో ఆపరేటరుగ ఉత్తీర్ణురాలయ్యెను.

యుద్ధం రాగానే ఆమె సైన్యంలో చేరెను. ఆమె అపుడే చేరిన క్రొత్త ఉద్యోగి కనుక దేశంలో ఉండు దళంలోనున్నా ఉండవచ్చును, కాని వెంటనే యుద్ధరంగానికి పోయే వైమానిక దళంలోనే పనిచేయుట కామె యిష్టపడెను. యుద్ధం ప్రారంభమయిన మూడో రోజునే ఆమె యుద్ధ రంగంలోనుండెను.

ఆమె యూనిటులో ఆమె కడు ధైర్యమగు రేడియో ఆపరేటరుగ నెంచబడెను. ఎటువంటి అననుకూల ప్రమాద పరిస్థితులలోనైన ఆమె ధైర్యం వీడక ప్రశాంతంగా నుండును. శత్రు విమానాలు తెరిపిలేకుండా వెంటాడుచు ఫిరంగులు ప్రేలుస్తున్నా, మరుషియా తన రేడియో యంత్రం వీడక, దిగువ కేంద్ర స్థానంలోనున్న వారికి వార్తలు పంపుచునేయుండెను.

కొంతకాలం ఆమెయున్న విమానదళం శత్రువులు ముట్టడిచేసిన ఒక నగరంపై తరుచు ఎగురుచు, ఆ నగరంలోనున్న వారికి విమానాలతో పోయి సప్లయిలు చేయడం, గాయపడిన వారిని స్త్రీలను, బిడ్డలను విమానాలలో తెచ్చి బయట భద్రమగు స్థలంలో చేర్చడం చేయుచుండెను.

ఒకనాడామె యున్న విమానం వాతావరణం బాగులేనందున గమ్యస్థానం చేరకముందే నేల బలవంతంగా దిగవలసివచ్చెను. శత్రు విమానాలు కొన్ని అది దిగుచుండగా పైన అగుపడ్డాయి. మారుషియా శాంతంగానుండెను. పెద్ద యుద్ధం జరుగపోతుందనే ఉత్సాహం మనసులో ఉబుకుచున్నది. " ప్రయాణీకులను చూస్తూవుండు, యీలోగా నేను " అని వైమానికుడు అర్ధోక్తిలో విడచి, మర ఫిరంగి స్థానంలో కూర్చొని పైకి నెగురుచున్న మూడు జర్మను విమానాలను కొట్టెను.

గాయపడినా పని వీడ లేదు

మారుషియా తన తలపైనుండు వైరులెను ఫోనులు తీసివేసి, భయపడుచున్న ప్రయాణీకుల చెంత జేరి ధైర్యం చెప్పుచుండెను. ఆ బిడ్డలు, స్త్రీలు తననే సర్వదా పరికించిచూస్తున్నారనియు, తన చేష్టలపై వారి ధైర్యమంతా ఆధారపడియున్నదనియు ఆమె గ్రహించింది.

మొదటి బాంబు ప్రేలుడు దగ్గరలో వినబడింది, తరువాత రెండు మూడు ప్రేలినవి, త్వరలో అంతా చెవులు చిల్లులు పడేటటువంటి ప్రేలుడు శబ్దాలే, ఒక బాంబు మరీ విమానం దగ్గరగా ప్రేలి విమానాన్ని కదిలేసింది. మారుషీయా తన సీటులోనుండి పైకిపడిపోయి తెలివి

# కాకసను - దాడివచ్చు శత్రువులకు స్మశానవాటిక.

## ఇండియాకు జర్మనులు రాదలచుట.

రష్యా అధ్యక్షుడు కాలినిను గారి వ్యాసం.

సోవియటు ప్రభుత్వం అధ్యక్షుడు ఎం. కాలినినుగారు సోవియటు వారున్యూసు అను పత్రికలో యిట్లు వ్రాసిరి :—

నాజీ జర్మనులు కాకసను రాష్ట్రిముపైకి రెండు మార్గములుగ త్రోసుకొని వస్తున్నారు—ఉత్తర కాకేసియను రైలుమార్గము ననుసరించి కొండల వరుస ప్రక్కగ మజడకు ప్రాంతములకును, రెండోమార్గము నల్ల సముద్రం తీరము ననుసరించి కాంగు - మైకాపు - నవరోసిస్కులమీదుగను రష్యను సేనల నిరోధంవలన జర్మనులదాడి మందగించినది. దినదినం శత్రువులనష్టం ఎక్కువగుచున్నది, ఆక్రమించిన ప్రతిమైలు జాగాకి వారెంతో నష్టపోతున్నారు.

కాకసను రాష్ట్రిం ఆక్రమించాలని జర్మనులెంతకాలంనుండియో కలలుగంటున్నారు. గత యుద్ధంలో 1918 యందు జర్మనీ వోడిపోవుటకు సిద్ధంగా నున్నపుడే ఆస్ట్రియను సేనానాయకుడు జనరలు అర్జుగారు తన పై అధికారులకు యిట్లు వ్రాసెను :—

"అప్పటికి ఉక్రేను రాష్ట్రిం ఆక్రమించినందున మెస్పటోమియావరకు భద్రమగు త్రోవ ఏర్పరచుకొనుటకు జర్మనులు వాంచించుచున్నారు. జర్మనీ పడమరవైపు విస్తరింపకుండా ఇంగ్లాండు అడ్డుతుంది కనుక జర్మనీ ఉకరైను క్రైమియాలమీదుగా ఇండియావైపు విస్తరింపవలెను. అని లెఫ్టనెంటు జనరలు క్రోయిసరు బాహాటంగా ప్రకటించియుండెను." కావున ఉకరైను, కాకసను, ట్రెబిజాండునందలి టర్కీభాగము, ఏషియా మైనరంతా తీసుకొని ఇండియాపై దాడి చేయాలని 1918 లోనే జర్మనులుద్దేశించిరి. ఆ రీతిగా ప్రపంచాధిపత్యం సంపాదింపదలచిరి నేడు ఆనాటి ఆశలను ఆనాటి కాకసనుదాడిని జర్మను పత్రికలు తిరిగి వర్ణించుచున్నవి. కాకసనును ఆక్రమించుటకు జర్మనులకు హక్కుగలదని ఆ పత్రికలు ప్రచారం చేయుచున్నవి. కాకసను ప్రజల కిపుడు ప్రమాదం ఎదుర్కొన్నది. జర్మను విమానాలు పైన తిరిగి కొండలోయ లన్నింటిని పాడుచేస్తున్నవి.

ఒక జర్మను సేనానాయకుడు రష్యా యితర భాగాలలో గోరిల్లా (చాటుదెబ్బల) యుద్ధానుభవం గలవాడు, కాకేషియా ప్రజలను హింసించి దోచుకోరాదనియు ముఖ్యంగా కాకేషియా స్త్రీలపై అత్యాచారాలు చేయరాదనియు కాకేషియా ప్రజలు చాల పగ సాధించే బుద్ధిగలవారనియు, తన సైనికులకు హెచ్చరించెను.

కాని నాజీ సైనికుల ఘోరకృత్యాలు మాటలవల్ల తగ్గవు. మర ఫిరంగులు తుపాకులే వాటికి జబాబు చెప్పాలి, దేశం పూర్తిగ ఆక్రమించబడేవరకు తమ దోచుకోవడం వాయిదా వేయమనియే జర్మను సేనానాయకుడు తనవారిని కోరెను.

నాజీల భ్రమ.

ప్రపంచంలో యితరులంతా తెలివితక్కువ దద్దమ్మలనియు, జర్మను ఫాసిస్టు పార్టీవారే తెలివైన వారనియు నాజీల ఊహ. ఉదాహరణకు నాజీలు

---

తప్పిపోయెను, తిరిగి తెలివివచ్చి విమానంలోకి వచ్చుసరికి పలువురు ప్రయాణీకులు గాయపడియున్నారు.

తన తల దెబ్బగూర్చి భుజంగూర్చి యోచించుటకు వ్యవధిలేదు. గాయపడిన యితరులకు ఆమె కట్లు కట్టుచుండెను. వైమానికుడు ఫిరంగి సీటులోనుండి బయటకువచ్చి ఎట్లున్నారని అడిగెను. ముగ్గురు గాయపడ్డారని మారుషియా తెలిపెను.

"విమానం ఎలాగుంది"?

"రెండుకన్నాలు పడ్డాయి కాని బాగానేవుంది."

కొద్ది నిముసాలలో విమానం తిరిగి గాలిలోకి ఎగిరెను. మారుషియా తిరిగి రేడియో యంత్రం చెవికి తలకు తగిలించుకొంది. కాని చాల నీరసంగానుంది. తలతిరుగుచున్నది. ఎడమచేయి విరిగి వ్రేలాడుచున్నది. క్షణక్షణం బాధ అధికంగానుంది. కాని తన పని మాత్రం మానలేదు. కేంద్రస్థానమునకు విమానం ఉనికి తెలుపు సందేశం పంపించెను.

ఈ రష్యా యువతి తనకేపని యిచ్చినా భక్తిశ్రద్ధలతో ధైర్యంగా నెరవేర్చును.

పట్టుకున్న వందలకొలది ఖైదీలలో పిరికివాని నొకని వేరుచేసి, వానికి బాగా తిండిపెట్టి జర్మనుల వశంలోనుంటే ఎంతో బాగుందని తమ దేశపు శిపాయిలకు చెప్పుటకై పంపుదురు. అట్లా శత్రు సేనలను మోసపుచ్చి భ్రమింపజేయ జూచుట తెలివితక్కువగును. ఇతరులు తెలివిలేని వార నుకొని తామే మోసపోతూవుంటారు.

కాకసను ప్రజ

కాకసను ప్రాంతాలలో అనేక జాతుల ప్రజలు గలరు. అదివరకు వారిలో ద్వేషాలు తగవులున్ను యితరులు స్వార్థంకొరకై కొన్ని శతాబ్దాలనుండి పెంచి ప్రోత్సాహించిరి. రష్యాలో విప్లవంవలన అచటి కార్మిక ప్రజకు ధనికుల చరతొలగుటేగాక జ్ఞానంకూడా కలిగింది. ఇపుడా జాతుల వారొకరినొకరు ద్వేషించుకోరు సరిగదా కలసి కట్టుగ పనిచేయుదురు. జాతి ద్వేషాలు నశించేయి. ఐకమత్యం హెచ్చింది.

ఎఱ్ఱ సైన్యం శత్రుదాడిని ఎదిరించి నిలుపుచున్నది. ప్రజలు ముందుకివచ్చిన జర్మనుసైన్యం వెనుక తిరుగుబాటుచేసి చావగొట్టుచున్నారు. ఉత్తర కాకసనులో కొన్ని జిల్లాలను జర్మనులు వశపరచుకొన్నారు. ఆ ప్రాంతములో కాకేషియను ప్రజలు కొండల చాటున దిగి గొరిల్లా యుద్ధాలు చేస్తున్నారు. అపుడే 500 జర్మను సిపాయిలను సైనికోద్యోగులను చంపిరి. ప్రజల యుద్ధం అక్కడ జరుగుచున్నది. ఉత్తర కాకేషియా రిపబ్లికు రాష్ట్రాలకు సహాయంగా దక్షిణ కాకేషియా తిరుగుబాటు చేయుచున్నది. జార్జియా జాతివారు అజర్బేడిజానియనులు, ఆర్మినియనులు ప్రత్యేక సైనికదళములను రష్యను ఎఱ్ఱ సైన్యంలో చేరి పోరాడుటకు పంపిరి. యుద్ధరంగానికి కావలసిన పరికరాలన్ని పంపుటకు సహాయం ఎక్కువచేయుటకు కాకేషియాలోనున్న పనివారు, రయితులు, విద్యావంతులందరు తీరిక లేక పనిచేయుచున్నారు. కాకేషియా ప్రజలను లోబరచుకొని ఆ కొండలమీదుగా ఇండియాకు రోడు వేయాలని జర్మనుల ఊహ. వారిని చావగొట్టుటకు మనకు అన్ని విధముల అవకాశం గలదు. కొకేషియాను దాడివచ్చు శత్రువుల స్మశానంగా మార్చివేయుదముగాక.



## ఇచ్చటి వాస్తవ్యులు *దరఖాస్తుచేయ నవసరములేదు!*

జపానువారు స్వాధీనం చేసికొనిన చైనాలోని వ్యాపార ప్రపంచంలో చిన్న పెద్ద అనే తారతమ్యం లేకుండ చైనావారిని జపానువారు ఉద్యోగములనుంచి తొలగించారు. ఇప్పుడు చైనాలో చీనావారి పారిశ్రామికదారులు లేరు. చైనా షాపులూ లేవు. ఉద్యోగాల్లో చైనావారు లేరు. గమాస్తాలు లేరు. సైపుచేయువారు లేరు. తుట్టతుదకు బజార్ల వెంబడి తిరిగి అమ్ముకొని జీవించే చైనావారుగూడ లేరు. ఇవన్నియు జపానువారి స్వాధీనమైయున్నవి. ఇవి వారికియుద్ధ ప్రతిఫలములు. జపానువారు వచ్చినప్పుడు ఇదే జరుగుతుంది.

ఇది ఇండియాలో జరుగువరకు నీవు చూస్తూ ఊరుకొనవద్దు. మన రక్షణశక్తిని బలపరచుకొని మనగెలుపు నిశ్చయమగువరకు ప్రతివ్యక్తియొక్క (స్త్రీగాని పురుషుడుగాని) సహాయ్యము చేయవలసియున్నది.



జపానువారి నెదుర్కొనుటకై దేశీయ యుద్ధరంగమును తయారు చేయుడు

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS AND PUBLISHED BY THE DIRECTOR OF WAR PUBLICITY, "VICTORY HOUSE", MOUNT ROAD, MADRAS.